శ్రీరస్తు

# తురిమెళ్ల మాధవ శతకము






ఇయ్యది

హిందూ బోర్డుస్కూల్ హెడ్ మాస్టరు

తురిమెళ్ళ, సిరారు మదారుపల్లి కంభం తాలూకా

కర్నూల్ జిల్లా వాస్తవ్యులగు

ఉదయగిరి చెన్నయ్యచే

రచియింపంబడి

అస్మద్దేశికులగు

శ్రీ పోలూరి శరభయోగిగారిచే సరిచూడఁబడి

ఏలూరు తాలూకా కరాణిగారగు

అన్నా సుబ్బయ్యశ్రేష్టిగారి ప్రోత్సాహమునచే

ఏలూరు, మంజువాణీముద్రాక్షరశాలయందు,

ముద్రింపంబడి ప్రచురింపంబడినది.

1924.

వెల 4 అణాలు.

శ్రీరస్తు.

# తురిమెళ్ల మాధవ శతకము.



ఇయ్యది

హిందూ బోర్డుస్కూల్ హెడ్ మాష్టరు

తురిమెళ్ళ, సివారు మదారుపల్లి కంభం తాలూకా

కర్నూల్ జిల్లా. వాస్తవ్యులగు

ఉదయగిరి చెన్నయ్యచే

రచియింపంబడి

అస్మద్దేశికులగు

శ్రీ పోలూరి శరభయోగిగారిచే సరిచూడంబడి

ఏలూరు తాలూకా వరాయిగారగు

అన్నా సుబ్బయ్యశ్రేష్ఠిగారి ప్రోత్సాహముచే

ఏలూరు, మంజువాణీముద్రాక్షరశాలయందు,

ముద్రింపంబడి ప్రచురింపంబడియె.

1924.

వెల 4 అణాలు.



# తురిమెళ్ల మాధవశతకము.



సీ. శ్రీరమణీనాథు ♦ సేవించిమదియందు
విఘ్నేశునివాణి ♦ వినుతి[illegible]
విద్యాగురులమనో ♦ వీథియందుననిల్పి
యతిభక్తిఁగవులకు ♦ నతులొనర్చి
పంకజనాభమీఁ ♦ యాంకితంబొనఁగూర్చి
జెప్పెద శతకంబుఁ ♦ జిత్తగించు
పంచకావ్యంబులు ♦ పఠియించగాలేదు
ఇంచుఛందస్సుసా ♦ ధించలేదు.
గీ. మృదుమధురవాక్యసంతతుల్ ♦ హృదయమందు
బొదలఁజేయుము సతతంబు ♦ సదయహృదయ
పుడమిలోపల తురిమెళ్ళ ♦ పురమునందు
వెలసియున్నట్టిమాధవ ♦ వేదవేద్య. ౧
సీ. శ్రీకరంబై భక్త ♦ జీవనంబై సదా
వినుతిఁగాంచుచునుండు ♦ విష్ణుపాద
కమలకర్ణికమధ్య ♦ కరమొప్పజన్మించి
మోదంబుగాంచుచు ♦ మొట్టమొదట
గుండ్లబ్రహ్మేశ్వర ♦ కుధరకాననసీమ
గుర్తుగన్పడుటచే ♦ గుండ్లకమ్మ

యనునామమునఁబొంది ♦ యాటంగనిలయంబు
రమణీయసురభిళ్వ ♦ రములదరిని
గీ. భారతమకూతుఁదురిమెళ్ల ♦ పురముచెంత
నిలచి గనుచుఁడువేట్కఁచే ♦ వెలసినారొ॥ పుడమి॥ ౨

సీ. కరమొప్పఁదూర్పున ♦ గలదు రేగడభూమి
బలుమెట్టధాన్యము ♦ ల్పండుచుండు
దక్షిణక్షేత్రంబుఁ ♦ దగనొప్పు రేగడ
సజ్జజొన్నయు కొఱ్ఱ ♦ జాలఁబండు
పశ్చిమధాత్రియుఁ ♦ బలువిధంబులుగల్గి
పసపుచెఱకును వరి ♦ ఫలితమొసఁగు
నుత్తరంబునగల్గు ♦ నుర్వికేదారమై
శాలిధాన్యంబులు ♦ సెలగఁబండు
గీ. నాల్గుదిశలనుగలభూమి ♦ బలసిపైర్లు
బండుజనసౌఖ్యమొసఁగు మీ ♦ భవ్యకృపను॥పుడమి॥ 3

సీ. జిగిఁగుల్కుబంగారు ♦ చేలముల్ధరియించి
తీరైనతిరిచూర్ణ ♦ తిలకమలఁది
భాసురంబగురత్న ♦ భూషణంబులుదాల్చి
అగరుగంధపుపూత ♦ లలరమేను
కమలామహీశనిం ♦ ముముదంబుననుఁగొల్వ
గరుడవాహనముపై ♦ ఘనతమెరసి
సిరిఁగుల్కుతురిమెళ్ల ♦ పురవీధులందున
సకలమంగళవాద్య ♦ సముదయముల
గీ. నుత్సవంబుననూరేగి ♦ యుచితవిధుల
సకలసంపదలిత్తువు ♦ సాదరమున॥పుడమి॥ ౪

సీ. శ్రీలక్ష్మీహృదయేశ ♦ జితవైరినిఖిలేశ
నారదమునిమోద ♦ నిగమపోష
కాకుత్స్థకులదీప ♦ కమలాప్తనిభరూప
కావవే నను సత్ప్ర ♦ భావదీప
పాకశాసనమిత్ర ♦ పరమమునిస్తోత్ర
భానువంశపవిత్ర ♦ భవ్యగాత్ర
దానవాంతకశూర ♦ ధరణీధరాధీర
తాటకసంహార ♦ తారహార

గీ. నిన్ను నెప్పుడు దలఁచెద ♦ నిగమవినుత
నాదుపాపంబులెడబాపు ♦ నళిననేత్ర ॥పుషమి॥ ౫

సీ. వందనం బిదెమీకు ♦ వనజాతనిభనేత్ర
దండంబుగొనుమిదె ♦ ధన్యచరిత
వందారుఘనకృపా ♦ వనమీకు నిరతంబు
జోహారులన్గొను ♦ సురుచిరాంగ
నవనీతదధిచోర ♦ నానమస్సులు మీకు
సాష్టాంగములుఁ బొందు ♦ సారసాక్ష
మోక్షదాయక కొను ♦ మొక్కులు చెల్లింతు
ఐదుపదులు నేతు ♦ సమరవైరి

గీ. నాదుపాపంబు లెడఁబాపు ♦ నయచరిత్ర
నీదునామంబు సతతంబు ♦ నేఁదలంతు ॥పు॥ ౬

సీ. ధరణిలోఁ గొందఱు ♦ ధనము నార్జింపంగ
వలెనని రేబగల్ ♦ వాంఛఁ బొంచి
నిది పాపహేతువు ♦ నీకార్యమును జేయఁ
దగదని మదిలోనఁ ♦ దలఁచకెపుడు

సాదుబీదలఁబట్టి ♦ సాధించి విత్తముల్
గొనుచుండు రెప్పుడు ♦ గొంకులేక
నిట్టిపాపులఁగాల ♦ నెట్టియుఁ గింకరుల్
కాలపాశంబులఁ ♦ గాసిఁజేతు

గీ. వినుచుఁ బెద్దలుఁ జెప్పుట ♦ యరయలేరు
నీదుసత్కృపఁగలుగక ♦ లేదుముక్తి॥పుడమి॥ ౭

సీ. పలుమారునీపాద ♦ భజనఁజేయనివారి
జన్మంబు జన్మమే ♦ జలజనయన
పుడమిలో నీపాద ♦ పూజఁజేయని నరుల్
పరలోక సౌఖ్యంబుఁ ♦ బడయఁగలరె
నిన్నునమ్మిన యట్టి ♦ నిర్మలాత్ములకెల్ల
మోక్షంబొసంగవా ♦ మోదమలర
భక్తాళినినునమ్మి ♦ భజనఁజేసినయంత
బలువైన కష్టముల్ ♦ బాసిచనును

గీ. గానమానవులెల్లనీ ♦ కరుణనెపుడు
బడయఁగోరుటె పరలోక ♦ భాగ్యమరయ ॥పుడమి॥ ౮

సీ. ధరణిలో మానవు ♦ లనువునిత్యంబని
నమ్మిపల్కరునీదు ♦ నామ మెపుడు
దారాసుతాదులుఁ ♦ దనకుదిక్కని నమ్మి
దలపోయరెపుడునీ ♦ దానవారి
తానుబోయ్యేవేళ ♦ దనవారలెవ్వరుఁ
దోడుగారారేరు ♦ తోయజాక్ష
తనువులోఁబ్రాణముల్ ♦ తర్లిపోయిన వెన్క
దాయాదులైనను ♦ దరికిరారు

గీ. వట్టియాశలునివిఁజూడ ♦ వనజనయన
గట్టిగానిన్ను నమ్మక ♦ గలదెముక్తి॥ పుడమి॥ ౯

సీ. కోట్యర్క నిభతేజ ♦ గోవర్ధనోద్ధార
నిందిరాహ్లాదయోశ ♦ సుందరాంగ
భవరోగవైద్యభా ♦ వజరిపునుతపాత్ర
నిఖిలేశనుత భక్త ♦ నిరుపమాన
దినకరశకలనేత్ర ♦ దీనజనాధార
పరమపవిత్ర సం ♦ భరితభక్త
పాకశాసననుత ♦ భావజరిపుమిత్ర
పవనజస్తుతిపాత్ర ♦ భవ్యగాత్ర
గీ. సన్మునిస్తోత్ర యదుకుల ♦ సత్పవిత్ర
కరుణతోఁజూత నన్నేలు ♦ కమలమిత్ర॥ పుడమి॥ ౧౦

సీ. నీనామమంత్రంబు ♦ నిబిడదారిద్ర్యాంధ
తమసంబులెడఁజిమ్ము ♦ తరణికిరణ
నీనామ మంత్రంబు ♦ నిఖిలపాపాటవి
మూరుపుతో ఛేదించు ♦ ముద్గరంబు
నీనామ మంత్రంబు ♦ నిత్యసౌఖ్యత్వంబుఁ
గలుగజేయుటకిలఁ ♦ గల్పవల్లి
నీనామ మంత్రంబు ♦ నిలచి పాపాబ్ధుల
బలిమిచే నింకించు ♦ బాడబంబు
గీ. నగుచు భక్తులజగమున ♦ ననయమేలు
గరుడవాహన నన్నేల ♦ కష్టమగునె॥ పుడమి॥ ౧౧

సీ. పశుపతిమిత్రనీ ♦ పాదాబ్జయుగ్మముల్
సేవించుచుండెద ♦ శేషశయన

పన్నగాధిపశాయి ♦ సన్నుతుల్ గైకొని
మన్నింపవేనన్ను ♦ సన్నుతాంగ
తాపసార్చితనీదు ♦ దాసదాసుఁడనాదు
దోషముల్ బాపవె ♦ దోషరహిత
కమలామనోహర ♦ కడుదూరముగ నాదు
యిడుములఁదోలవే ♦ యిందిరేశ
గీ. భక్తజన బృంద వందిత ♦ పరమపురుష
నీవెదిక్కని నమ్మితి ♦ నిర్మలాత్మ॥ పుడమి॥ ౧౨

సీ. ఇందిరా హృదయార ♦ విందసానందాది
తాపసహృదయాంబ ♦ తరణికిరణ
అసురదైత్యారణ్య ♦ యగ్నిహోత్రపవిత్ర
వరసుచారిత్రపా ♦ వనసుగాత్ర
పన్నగ రిపువాహ ♦ పవనజ నుతిభక్త
పాలన రిపు భీమ ♦ పాపహరణ
తాపసమందార ♦ తరణివంశజసుర
రాజవందిత భాను ♦ తేజమెపుడుఁ
గీ. కరుణయుంచుము నాపైని ♦ కామజనక
బుధనుత వ్రాతసన్నుత ♦ పుణ్యచరిత॥ పుడమి॥ ౧౩

సీ. భక్తితో నీనామ ♦ భజనఁజేసెడివారి
పుణ్యమేమనవచ్చు ♦ భువనజనక
దీనపోషకనీదు ♦ ధీరత్వములనెల్లఁ
దలఁచిన వారలు ♦ ధన్యమతులు
నిగమ గోచరనీదు ♦ నిత్యత్వమహిమలు
దెలసినవారలు ♦ తేజయుతులు

కలశాబ్ధిశయన నీ ♦ కారుణ్యకార్యముల్
ఎందు నీభక్తులు ♦ యెఱుఁగఁగలరు
గీ. ఇతలు లెరుఁగట కలవియే ♦ యిందిరేశ
ఉత్తమభక్తిగనిన్ను నే ♦ నుర్విఁదలఁతు ॥ పుడమి॥ ౧౪

సీ. మందరాచలధీర ♦ మమ్మేలు మమ్మేలు
కమలాప్తకులదీప ♦ కరుణఁజూడు
దనుజసంహారమమ్ము ♦ దయతోడరక్షించు
కమలామనోహార ♦ కావువేగ
కమలాసనస్తుత ♦ ఖగరాజవాహన
నిరతంబుమమ్మేలు ♦ నీలవర్ణ
క్షీరసాగరవాస ♦ క్షితిసుతాహృదయేశ
పాలించవేనన్ను ♦ పాపనాశ
గీ. భక్తవత్సల సర్వేశ ♦ భానుతేజ
భాగవతతోష బుధనుతి ♦ పరమపురుష॥ పుడమి॥ ౧౫

సీ. పరమపావననామ ♦ పాలించినన్నేలు
నిరతంబునమ్మితి ♦ నిర్వికల్ప
కరిరాజరక్షక ♦ కరుణించవేనన్ను
పరిపూర్ణకృపయుంచి ♦ పాపహరణ
ఇనకోటి సమతేజ ♦ దినకరకులపోష
నిన్ను సేవించెద ♦ నీరజాక్ష
గరుడవాహనదివ్య ♦ కౌస్తుభాలంకార
నిగమగోచరనాథ ♦ నీవెదిక్కు
గీ. వేరెయొకదిక్కు లేదయ్య ♦ వెదకిచూడ
ఎవ్వరక్షింప నీభార ♦ మిందిరేశ॥ పుడమి॥ ౧౬

సీ. దండితారాతి ప్ర ♦ ఛండభండనభీమ
ఖండేందుధరమిత్ర ♦ కంజనేత్ర
అండజవాహన ♦ మండితమణిభూష
బృందారకస్తుత ♦ భువనజనక
తండోపతండవి ♦ ద్వజ్జనసేవిత
పుండరీకాక్షయో ♦ ఖండితాఘ
నందనందన సనం ♦ దన మానినుతసదా
భ క్తపోషితదివ్య ♦ పారిజాత
గీ. వందనంబు లొనర్చెద ♦ డెందమరల
నిందిరాధిపనన్నేలు ♦ సుందరాంగ. పుడమి. ౧౭

సీ. అఖిలాండకోటి బ్ర ♦ హ్మాండనాయకనన్ను
కరుణించిరక్షించు ♦ కామజనక
సకలసన్మునిసేవ్య ♦ యకలంక గుణదివ్య
నాయకధరభీమ ♦ సత్యకామ
మందరాచలధీర ♦ నందనందనశూర
పావనాకారయో ♦ పాపదూర
దినకరకులదీప ♦ దివిజవందితపాప
పరిహార రణశూర ♦ దురితదూర
గీ. ఇందిరాధిప నిఖిలేశ ♦ వందనంబు
భవము లెడఁబాపి రక్షించు ♦ భార్గవజనక. పుడమి. ౧౮

సీ. అరుదని సురలెన్న ♦ యావిభీషణునకు
యభయంబొసంగవా ♦ హస్తి వరద
అమరకంటకులగు ♦ యసురావళులనెల్ల
దురమున ద్రుంపవా ♦ దురితదూర

ఇనసూనుమిత్రత్వ ♦ మొనరించి వైదేహి
తెరగెల్లఁగాంచవా ♦ దేవదేవ
అబ్ధిబంధించియా ♦ యసురావళులనెల్ల
హతమొనరింపవా ♦ యసురవైరి
గీ. నీకు పగవారలెందైన ♦ నిలువగలరె
కరుణతోఁడుత నన్నేలు ♦ కలుషహరణ. పుడమి. ౧౯

సీ. అనఘ మీకరుణా క ♦ టాక్షమంచిన నెంత
దారిద్ర్యుఁడైనను ♦ ధనికుఁడగును
నవనిధుల్గలవాఁడు ♦ తవకృపారసమేది
మోదమందకచాల ♦ ఖీనయఁగును
పుణ్యాత్మ మీదయ ♦ పుడమిలేకుండిన
గడ్డిపోచైనను ♦ గదలఁగలదె
కలశాబ్ధి శయన మీ ♦ కారుణ్యమును బొందు
మానవులేవేళ ♦ మహిని ఘనులు
గీ. మీకుదయగల్గునటునటె ♦ మెలఁగఁగలనె
మూర్ఖుడను నన్నుజేపట్టు ♦ ముదముతోడ. పుడమి. ౨౦

సీ. అవనిజాహృదయేశ ♦ పవననందనపోష
నినునమ్మియున్నాఁడ ♦ మనుజవేష
దినినాథ వంశజ ♦ దనుజసంహారచక్రి
ధరనీదు కృపయుంచు ♦ మరువకెపుడు
దాసపోషకనన్ను ♦ గాసిఁజేయకునీవె
గతియనినమ్మితి ♦ సతతమెదద
పుడమిలోపలనేను ♦ బడరానియిడుమలఁ
బడుచునిద్దలచినఁ ♦ బాయుచుఁడు

గీ. నందుచేతను మీచర ♦ ణాబ్జములను
హృదయముననిల్పియున్నాఁడ♦నుదధిశయన॥పుడమి॥ ౨౧

సీ. అనుదినంబునునిన్ను ♦ మనమునఁ దలపోయ
పాపపుంజంబులు ♦ బాసిచనును
యనుచు పెద్దలుబల్క ♦ నదిచెవినిడకను
పరధనాపేక్షకై ♦ పరుగులిడుచు
దేవభూసురగురు ♦ తీర్థవాసులదైన
గొనుచుండ్రి విత్తంబుఁ ♦ గొంతులేక
ఈలోకభోగంబె ♦ నిచ్చలో నెరనమ్మి
పరలోకవార్తల ♦ ఫలితమెల్ల

గీ. రిట్టివారలె గలరుర్వి ♦ నెచటనిప్పు
డెట్లుదాఁట్చునో భూదేవి ♦ నేదిగతియొ॥పుడమి॥ ౨౨

సీ. జనకజమానసా ♦ బ్జాప్తనీయంఘ్రిల
ననిశంబు పూజించు ♦ నట్టివారు
దినినాథతేజనీ ♦ దివ్యనామంబును
బలుమారు బఠియించు ♦ భాగ్యయుతులు
దివిజవందిత నీదు ♦ దివ్యతేజంబునుఁ
జూచిసంతోషించు ♦ సుజనులెల్ల
నిరుపమాకారనీ ♦ నిర్మలచరితముల్
నిరతంబుఁ జదివెడు ♦ నీతిమంతు

గీ. లెల్లసుఖమునుఁబొందుదు ♦ రెల్లకాల
మనుచునార్యులు ఁబల్కెదు ♦ రవనియందు॥ పుడమి॥ ౨౩

సీ. సనకాదిమునివంద్య ♦ సాదరంబుగనాదు
మనవాలకింపవే ♦ మదనజనక

మదగజ పోష నా ♦ మదియందు నిలచియు
శుభము లొసంగవే ♦ సురుచిరాంగ
గోపికారమణనా ♦ కోరికల్ నీపాద
భజనయందే నిల్పు ♦ భక్తవరద
పరమపవిత్ర నీ ♦ పాదాబ్జయుగ్మముల్
గతియనినమ్మితి ♦ గానలోల
గీ. విగత పాపౌఘకానన ♦ వీతిహోత్ర
పావనాకార భక్తార్థి ♦ పారిజాత ॥ పుడమి॥ ౨౮

సీ. ఇనవంశనిధిసోమ ♦ ఘనశౌర్యరిపుభీమ
కనకాంబరశ్యామ ♦ వినుతసామ
మందరాచలధీర ♦ అంధకాసురహార
బృందారకాధార ♦ నందతనయ
వరభక్తనుతపోష ♦ కరుణించు మణిభూష
పర్యంకవరశేష ♦ పరమపురుష
నీరజదళనేత్ర ♦ నిరుపమానచరిత్ర
నారదస్తుతిపాత్ర ♦ నయచరిత్ర
గీ. వాసవస్తోత్ర దశరథ ♦ వంశమిత్ర
కంజదళనేత్ర రక్షించి ♦ గాసిఁదీర్చు॥ పుడమి॥ ౨౯

సీ. ఉరగేంద్రశయనమీ ♦ రుదధి బంధించియు
దురమున నసురులఁ ♦ దునిమినారు
పతితపావనమీరు ♦ పదముసోకించియు
శిలరూపునాతిగాఁ ♦ జేసినారు
కరుణ సాగరమీరు ♦ కరిరాజు మొఱవిని
కరుణించి రయమున ♦ గాచినారు

దానవాంతక మీరు ♦ దనుజుని తమ్ముఁడు
భయపడి రాఁగఁ జే ♦ పట్టినారు
గీ. భక్తవత్సలుడనుపేర ♦ బరఁగినారు
విగత పాపౌఘ యిపుడు వ ♦ న్నేమనవబోరు॥ పుష్కమి॥ ౨౬

సీ. దంతిరక్షకనాదు ♦ వంతలెల్ల న్ని ముఁదీర్చి
సంతసింపఁగఁజేయు ♦ సారసాక్ష
భవరోగ వైద్యుఁడ ♦ భావమాచరితనీ
మహిమంబుగనజాల ♦ మదనజనక
గోకుల తిలకరో ♦ గోవర్ధనోద్ధార
నన్నుమన్నించవే ♦ నాగశయన
దురితవిదూరరో ♦ దుష్టదానవహార
కరుణించి రక్షించు ♦ కంజనేత్ర
గీ. నిష్టలెఱుఁగను పూజింతు ♦ నిన్ను నేను
కష్టములఁజెందఁగా నీకు ♦ కలుషహరణ. పుష్కమి. ౨౭

సీ. కమలాశనస్తుత ♦ కరుణించి వేవేగ
నిడుముల నెడబాపు ♦ నిందిరేశ
మౌనివందితపద ♦ వనజాతయుగళ నీ
పరమపావననామ ♦ పఠనఁజేతు
ఖగరాట్తురంగనీ ♦ కరుణఁ గల్గినఁజింత
కనుదుఃఖ విపదాబ్ధిఁ ♦ గడువనచ్చు
నంచునేననయంబు ♦ సంచితంబులఁబాప
మీ పై భారంబంచు ♦ మోదమందు
గీ. చిన్నవాఁడను నన్నేలు ♦ సన్నుతింతు
నితరులనునమ్మజాలనే ♦ నిందిరేశ. పుష్కమి. ౨౮

సీ. కదనరంగోత్తుంగ ♦ కఠినదైత్యాచల
సముదయంబులకు న ♦ జాగ్రియుధంబు
గర్వదుర్వారులై ♦ కమమోదమునఁబొంగు
యసురాబ్ధిబాడ ♦ బంబనఁగనొప్పి
మదముచే మెలఁగెడు ♦ మత్తేభదానవ
కేసరి సమమన ♦ వాసిఁజెంది
కమభయంకరదుష్ట ♦ కలుషాటవులకెల్ల
వీతిహోత్రుండన ♦ వినుతిఁగాంచి

గీ. నట్టినీనామ మెప్పుడు ♦ పట్టువిడకఁ
బలుకుచుండెద నిరతంబు ♦ పద్మనాభ. పుడమి. ౨౯

సీ. గరుడవాహననీదు ♦ కరుణలేకుండిన
ధరణిలో మానవుల్ ♦ దాళఁగలరె
ఇందిరాధిపనీదు ♦ యిచ్ఛలేకుండిన
నిలలోనిసస్యముల్ ♦ నిలువఁగలవె
భువనవందితనీదు ♦ భుజబలంబునులేక
సంయముల్ తపములు ♦ సలుపఁగలరె
దాసపోషకనీదు ♦ దయలేకయుండిన
దివిజాధిపతియైన ♦ దీనుఁడగును

గీ. గాన పుట్టింపఁగిట్టింప ♦ గతమొసర్ప
కారణుఁడవందు రార్యులు ♦ కమలనయన. పుడమి. ౩౦

సీ. అఖిలప్రపంచంబు ♦ నఖిలభూతంబులు
నీయధీనంబులు ♦ నిర్వికల్ప
పుట్టింపఁ బోషింపఁ ♦ బుడమిప్పెఁగిట్టింప
నీవెగర్తవటంచుఁ ♦ నిగమవేద్య

తల్లిదండ్రిఁ నీవె ♦ దాతఁ దైవమునీవె
ఎల్లబాంధవులీవె ♦ యిందిరేశ
తప్పులుజేసినతన ♦ తనయుని పైప్రేమ
వదలునాజనని లే ♦ వనునుగాక
గీ. జనని, జనకుండ వై సర్వ ♦ జనులనెప్డు
తప్పులెన్నక రక్షించు ♦ దాతవీవె. పుడమి. ౩౧

సీ. నీదయా గుణముల ♦ నేరఁ జువర్ణింప
ధాత్రియైననుభువి ♦ ధన్యచరిత
నీమాయజాలముల్ ♦ నిఖిలప్రపంచంబు
దెలియుటకష్టంబు ♦ దేవదేవ
దాసజాలముపెంట ♦ దగిలియేవేళలఁ
గాపాడుచుందువు ♦ గానలోల
కార్యంబునకునెల్లఁ ♦ గర్తవీవనినమ్మి
చేయుచుండెదనయ్య ♦ శేషశయన
గీ. భక్తమందార కలుషఘోర ♦ భవవిదూర
నన్నుఁగాపాడి రక్షించు ♦ నతశుభాంగ. పుడమి. ౩౨

సీ. కలికాలమునజనుల్ ♦ కలుషపాపయుతికార్య
రతులునై మెలఁగుచు ♦ రాత్రిఁబగలు
పరధనాపేక్షచే ♦ బరుగులెత్తుచువిప్ర
గురువిత్తములనైన ♦ గుంజుకొనుచు
నిమిషకాలంబైన ♦ నీతిగోరకనీదు
నామంబుదలచక ♦ నమితవిషయ
కాములై పరలోక ♦ గతిఁదమమదిలోన
దలపోయకెప్పుడు ♦ ధరణియందు

గీ. మెలఁగుచున్నారు మూఢులై ♦ మేఘవర్ణ
నిన్నుదలఁచక మోక్షంబు ♦ నెన్నలేము. వృషభ. 33

సీ. సత్యంబునీమీఁద ♦ సత్క్రథల్ వినుచుండ
సకలపాపంబులు ♦ సమసిపోవు
నీపాదకంజముల్ ♦ నిరతంబుఁ బూజింప
నిఖిలకల్మషవార్ధి ♦ నెగిసిపోవు
నీదయాగుణములు ♦ నిరతంబుఁ గొనియాడ
దురితంబులెల్లను ♦ దొలఁగిచనును
నీనామమునుసదా ♦ నిష్ఠతోఁ పఠియింపఁ
గాలపాశంబుచేఁ ♦ గట్టుపడరు

గీ. యంచు బుధులెల్లఁబల్కుచు ♦ రవనియందు
దీనులకునెల్ల నవనిలోఁ ♦ దిక్కునీవె. వృషభ. 34

సి. శ్రీకరభక్తవ ♦ శీకర కరుణాక
టాక్ష పాపవిదూర ♦ యమితశూర
శాత్రవ నగకులి ♦ శాయుధ నిభ దివ్య
సాయక ధరనుత ♦ సన్నుతాంగ
నిగమగోచర తత్వ ♦ నిలయ నిరంజన
సనకాది మునివంద్య ♦ సత్యకామ
నగధీర ధరధర ♦ నగవైరి ధరనుత
నగజాత విభుమిత్ర ♦ నయచరిత్ర

గీ. దీనరక్షక నాపాలి ♦ దిక్కటంచు
నమ్మియున్నాఁడ రక్షించు ♦ నాగపోష. వృషభ. 35

సీ. కదనరంగంబునఁ ♦ గడు భయంకరులైన
దనుజ సంఘంబుల ♦ దునుముటకును

భూభారముడిపియు ♦ భూతంబులకునెల్ల
నిత్యసౌఖ్యత్వంబు ♦ నించుటకును
పుడమిపై ముయ్యేడు ♦ పుట్టువుల్ ధరియించి
కడుకూ్రర దనుజుల ♦ గర్వమడఁచి
ఉర్వీలోపల పెక్కు ♦ లుపకారములుసల్పి
సుజనుల మనముల ♦ సొంపునింపి
గీ. నుతులుగైకొన్న హరినిన్ను ♦ సతతమెదను
దలఁచుచుండెద రక్షించు ♦ ధన్యచరిత. పుడమి. 38

సీ. భవబంధరజ్జులఁబట్టి ♦ ఖండింప నీ
భజన లవిత్ర సం ♦ భావితంబు
కలుషేభ మస్త్రిక్క ♦ ఖాదనంబొనరింప
హరిసాటి నీభజ ♦ నసుఁగఁదనరు
నిఖిలపాతక సర్ప ♦ నికరంబుఁ బరిమార్ప
నీభజనంబిల ♦ నెఱులఱేఁడు
భవరోగములనెల్ల ♦ బారదోలుటకు నీ
భజన ధన్వంత్రినాఁ ♦ బరఁగుచుండు
గీ. ననుచు బుధవర్యులెల్ల ని ♦ న్నభినుతింతు
రిందిరాధిప నన్నేలు ♦ సుందరాంగ. పుడమి. 39

సీ. భావజజనకనీ ♦ భక్తవత్సలతయు
పరమభక్తులు దప్ప ♦ పరులుగనరు
నిలచి సర్వంబును ♦ నీయాధీనంబని
మెలఁగనేర్చినయంత ♦ మేలుఁగల్గు
జనకుండు దయతోడ ♦ దనసుతు నేరీతిఁ
గాపాడుచుండు నా ♦ కరణిఁదనర

వెనువెంట సతతంబు ♦ వెతలు దీర్పుటకును
దిరుగుచుండెదవంట్రి ♦ దీనపోష

గీ. భాసయదువంశకులభూష ♦ పరమపురుష
భరితకరుణాసముద్రమో ♦ పాపదూర ॥పుడమి॥ 3౮

సీ. నారాయణాచ్యుత ♦ నళినలోచన నీదు
పాదపంకజములు ♦ పట్టువారి
కిలలోననేకీడు ♦ గలుగదంచార్యులు
బలుకుచుందురుసదా ♦ పాపహార
మనుజులనేప్రొద్దు ♦ మహిలోనగాపాడి
కామితార్థముసంగు ♦ ఘనుడవంచు
నమ్మిభక్తాళినీ ♦ నామమంత్రము సదా
ధ్యానించుచుందురు ♦ ధరణియందు

గీ. నేననిష్టలెఱుంగక నీవెదిక్కు
టంచునమ్మితిఁ గరుణించి ♦ యాదరించు ॥పుడమి॥ 3౯

సీ. ఆదిమధ్యాంతంబు ♦ లవనిపుట్టువుచావు
లారయలేదందు ♦ రార్యవరులు
సూక్ష్మిగామీకును ♦ రూపనామంబులు
వెదకినలేవంద్రు ♦ వేదవిదులు
అణుమాత్రమైయుండి ♦ యఖిలప్రపంచంబు
నాదరించియువెల్గు ♦ నదిమొనీవ
టంచు నీకీర్తుల ♦ నతిముదంబునమునుల్
నుతియించుచుందురు ♦ సతతమోదను

గీ. మీకునొకయూరు నొకపేరు ♦ మేరఁగలదె
పుడమినవతారములుచేతఁ ♦ బుట్టుగల్గె॥పుడమి॥ ౪౦

సీ. ఏసుగుణాకరుం ♦ డేవేళభక్తుల
వేవేగరక్షింప ♦ వేచియుండు
నే సుగుణాకరుం ♦ డీరేడుభువనముల్
దనకుక్షిభరియించి ♦ దడయకేలు
నేస్వయంభువుఁడు నీ ♦ పృథివిలోపలనుండు
భూతకోటులకెల్లఁ ♦ బుట్టినిల్లు
నేనిత్యుఁడిన శశి ♦ నేత్రుఁడై విలసిల్లి
యఖిలప్రపంచంబు ♦ నాదరించు
గీ. నేసుధీమణిభక్తుల ♦ నేలుచుండు
యట్టిదేవుండనన్నేలుఁ ♦ యవనియందు॥ పుడమి॥ ౪౧

సీ. కమలాసనసుత ♦ విమలయశోనిధి
కరుణించి కరిరాజుఁ ♦ గాచినావు
విహగరాడ్వాహన ♦ విన్నపంబాలించి
రాక్షసతనయు ♦ రక్షించినావు
భక్తకల్పద్రుమ ♦ పాంచాలివేడిన
ఎడతెగనివల్వలు ♦ నడిపినావు
పాకశాసను మొఱ ♦ పాటించి బలినొంచి
నిలఁగొని ఇంద్రున ♦ కిచ్చినావు
గీ. భక్తకోటుల కష్టముల్ ♦ బాపినావు
ఇంచుకైనను ననుగావ ♦ నేలరావు॥ పుడమి॥ ౪౨

సీ. మీనరూపంబున ♦ దానవుఁబరిమార్చి
వార్ధిలోఁ గొనివచ్చి ♦ బ్రహ్మకపుడు
కూర్మరూపంబున ♦ కుధరంబు ధరియించి
యమృతం బొసంగవా ♦ యమరులకును

కిటిరూపు ధరియించి ♦ కుటిల దానవుద్రుంచి
ధరణిని గొమ్ముపై ♦ దాల్చిమించి
నరకేసరుండవై ♦ సురవైరి దెగటార్చి
బాలునిఁ బ్రోచవా ♦ వంతమునను
గీ. తరమె నీ పదియవతార ♦ గరిమలెన్న
ధాతకైనను నెన్నగాఁ ♦ దరముఁగాదు॥ పుడమి॥ ౪౩

సీ. ఇల కధిపతికెందు ♦ నెలవ లేకుండునే
కలశాబ్ధిలోనేల ♦ కాపురంబు
సిరివరదునకెందు ♦ సజ్జలేకుండునే
ఫణులపై శయనించు ♦ పాటదేమి
నెక్కి చరింపను ♦ బండి గుఱ్ఱములేదె
గరుడునిపై దిరుగు ♦ కతమదేమి
భాగ్యవంతున కొక్క ♦ పట్టులేకుండునే
ఎందు జూచిన యేల ♦ నిమిడియుంట
గీ. మహిని నిటువంటి యైశ్వర్య ♦ మహిమఁగలదె
దలఁపభక్తులు నీశక్తిఁ ♦ దెలియఁగలరు॥ పుడమి॥ ౪౪

సీ. ఉర్విలో బహుజనుల్ ♦ యుపకార రహితులై
యొరుల సంపదఁజూచి ♦ యోర్వలేరు
ధనికు చెంతనుఁజేరి ♦ తప్పపాఠ్యముఁజెప్పఁ
దరివేది యుందురు ♦ దురితమనక
ధర్మకార్యముఁ జేయు ♦ దాతయొద్దనుజేరి
విఘ్నంబు లొకకొన్ని ♦ విన్నవింతు
జనులలో నొండొరుల్ ♦ జగడమాడక యున్న
దీనాననములచేఁ ♦ దిరుగుచుందు

గీ. నిట్టివారలు ధరణిలోఁ ♦ బుట్టిపెరుగ
సాదుబీదలు జీవించు ♦ చందమేది॥ పుడమి॥ ౮౫

సీ. ఇందిరారమణరా ♦ కేందు బింబానన
బృందారకస్తుత ♦ నందితాంగ
కందర్పశతకోటి ♦ సుందరనింపురా
వెఁదుకీ చందము ♦ వందిథార్య
వందారుగోనినాథు ♦ వెందమందానంద
మొందగా నింపురా ♦ సుందరాంగ
బంధురంబగుపాప ♦ బంధముల్ పొందుగా
నఁదండదుృంచు సా ♦ నందవినుత
గీ. నిందునందును నెందును ♦ నెశములేక
నుఁదువందురు ♦ నిందిరానందహృదయ ॥పుడమి॥ ౮౬

సీ. నారాయణాచ్యుత ♦ నరహరిగోవింద
నాబాధలెడఁజమ్మ ♦ నళిననేత్ర
నీపాదపద్మముల్ ♦ నిరతంబు దిక్కని
నమ్మియున్నాడను ♦ నెమ్మనమున
పాపాత్ముఁడను నన్ను ♦ పాలించకుండిన
దిక్కెవరిఁకనాకు ♦ దీనపోష
దాతవటంచునీ ♦ దాపుజేరినవారి
కాపాడఁగూడదే ♦ కామజనక
గీ. భక్తవత్సల నిఖిలేశ ♦ భానుతేజ
దాసధాసుండ నన్నేలు ♦ ధన్యచరిత॥ పుడమి॥ ౮౭
సీ. శ్రీరమాధిప నిన్ను ♦ చిత్తంబులోపల
ననయంబు దలఁచిన ♦ నఘుఘుదొలఁగు

కమలాక్ష నీకథల్ ♦ కనుఁగొన్న వినువారి
కలుష జాలములెల్ల ♦ కడకుఁబాయు
రతిపతి జనకనీ ♦ రమ్య చారిత్రముల్
బల్కఁగా పాపముల్ ♦ బాతిపోవు
నిగమగోచర నిన్ను ♦ నిరతంబుఁ గొనియాడ
నిఖిల కల్మషవార్ధి ♦ నెగసిపోవు
గీ. ననుచు బుధులెల్ల మీనామ ♦ మనుదినంబు
పఠనఁజేసియు మోక్షంబుఁ ♦ బడసిరయ్య॥ పుడమి॥ ౭౫

సీ. పాండవేయసుపోష ♦ పాపనాశన వేష
భాషాపతీనుత ♦ పరమ పురుష
దాసజనాధార ♦ దశరథ సుకుమార
నరకేసరవతార ♦ సగసుధీర
వైకుంఠ పురవాస ♦ వరగుణ మణిభూష
దినకరకుల పోష ♦ దివ్యభూష
వేణుగానవినోద ♦ విదితాత్మనుత పాద
సాధుజనామోద ♦ సకలవేద
గీ. నీవెనాగతి రక్షింప ♦ నిగమవినుత
వేరెయొక దిక్కులేదయ్య ♦ వెదకిచూడ. పుడమి. ౭౬

సీ. సామగాన వినోద ♦ తామసింపక నన్ను
దయతోడ రక్షించు ♦ ధన్యచరిత
దురితవిదూర నా ♦ దురితజాలములెల్లఁ
దొలఁగించి కావవే ♦ తోయజాక్ష
దనుజసంహారకా ♦ మనమునం దలఁచెద
దరిఁజేర్చి కాపాడు ♦ దానపోష

సనకాదిమునివంద్య ♦ కనకాద్రి సమధైర్య
నన్నాదరింపవే ♦ నాగపోష
గీ. నీదుభారంబు నన్నేల ♦ నిరుపమాన
కరుణసాగర నిఖిలేశ ♦ కామజనక. పుడమి. ౫౦

సీ. అక్షయుం డక్షరుం ♦ డానంద మయుఁడును
సత్యస్వరూపుండు ♦ సర్వసాక్షి
నిగమాంత వేద్యుండు ♦ నిర్వికల్పుండును
ఖగవాహనుండును ♦ కలుషదూరు
డఖిలస్వరూపుండు ♦ నాద్యంతరహితుండు
సకలార్థ సంధాత ♦ సర్వసముఁడు
సకల జగద్ధాత ♦ సంరక్షకుండును
భక్తవత్సలుఁడును ♦ భానుతేజు
గీ. డై నవానిని నిన్నునే ♦ ననుదినంబు
దలఁతు దయతోడరక్షించు ♦ దాసపోష. పుడమి. ౫౧

సీ. అఖిలదుఃఖవినాశ ♦ యఘములఁ దోలవే
కమలోదరమున నీదు ♦ కరుణ యుంచి
భవరోగవైద్య నా ♦ భావమందున నిన్ను
నుతియించుచుండెద ♦ నుతసురేంద్ర
అపదోద్ధారకా ♦ యాపద లెడజిమ్ము
నీపాదవనజముల్ ♦ నేఁదలంతు
కరుణసాగర నాదు ♦ కష్టముల్ దొలఁగించు
నీనామమును సదా ♦ నెదదలంతు
గీ. దాసదాసుండ విడువకు ♦ దనుజవైరి
నీదెభారంబు రక్షింప ♦ నిరుపమాన. పుడమి. ౫౨

సీ. పుండరీకాక్ష నీ ♦ యుండఁ జేసినవారి
దండిఁ చంబాలను ♦ దండధరుఁడు
భక్తవత్సల నీదు ♦ భజనఁ జేసినవారి
సరసకుఁ జేరరు ♦ శమనుభటులు
నీలమేఘ శరీర ♦ నీకీర్తనలుఁ బాడు
జనులనుఁ జెందదు ♦ జమునిభీతి
గరుడవాహన నీదు ♦ కథలాలకించిన
ఘనుల వంచించదు ♦ కాలుదండ
గీ. మనుచునార్యులుఁ ♦ దెల్పుదు రవనియందు
నీదుభజనకు పాటియు ♦ లేదునొకటి. పుడమి. ౫౩

సీ. ఈరేడుభువనముల్ ♦ ఇముడించి కుక్షిలో
కడువేడ్కభూతాళిఁ ♦ గాచినావు
తల్లిచందంబున ♦ ధరణిలోఁ బ్రాణులఁ
జాలప్రియంబునఁ ♦ జాకినావు
పుట్టింపరక్షింప ♦ భూతాళి నణఁగింప
కర్తవీవనికీర్తిఁ ♦ గాంచినావు
యఖిలభూతంబుల ♦ యంతరాత్మలఁ జేరి
సకలకార్యంబులఁ ♦ జరిపినావు
గీ. భువినిభక్తుల రక్షింపఁ ♦ బుట్టినావు
వినుతులొనరించువారల ♦ విడువబోవు. పుడమి. ౫౪

సీ. ఆద్యంతరహితమై ♦ యాకాశరూపమై
పుట్టు గిట్టునులేకఁ ♦ బుడమిఁదాల్చి
నిర్వికారుండవై ♦ నిరుపమానుండవై
జ్యోతిరూపుండన ♦ ఖ్యాతిఁగాంచి

నిగమగోచరమునై ♦ నిత్యమై సత్యమై
నిష్కళంకంబునై ♦ నిండియుండి
సన్నియుతానమై ♦ నెన్నసశక్యమై
సూదిమోపనెడంబుఁ ♦ జూడలేక
గీ. సర్వజగముల రక్షింప ♦ సాక్షియగుచు
నుండువానికినీకునే ♦ దండమిడుదు॥ పుడమి॥ ౫౫

సీ. నారాయణాచ్యుత ♦ నరహరి కేశవ
పరమమానిస్తోత్ర ♦ పాపహరణ
వాసుదేవముకుంద ♦ వసుదేవనందన
పరమపూరుషభక్త ♦ పారుజాత
దిననాధకులవర్య ♦ దీనజనాధార
కనకాద్రి సమధైర్య ♦ కామజనక
ఇనకోటి సమతేజ ♦ సనకాదిమునినుత
నిరుపమానసుగాత్ర ♦ నిగమవినుత
గీ. నిన్నె నెరనమ్మియున్నాఁడ ♦ నిర్వికల్ప
నన్నురక్షించు కృపయుంచి ♦ నళిననాభ॥ పుడమి॥ ౫౬

సీ. ప్రకటదానవగర్వ ♦ పర్వతంబులఁగూల్చు
కులిశాయుధముసాటిఁ ♦ గూర్పనొప్పి
దితిసుతవిక్రమ ♦ ద్విరదాళివారియించు
కేసరిసముఁడను ♦ కీర్తిగాంచి
దనుజవిక్రమవార్ధు ♦ లనయంబునింకించు
బడబానలఖ్యాతిఁ ♦ బడసిమఱియు
సజ్జనహృదయాబ్జ ♦ సంఘంబులకునెల్ల
దినకరుండననొప్పి ♦ దివిజవరుల

గీ. సర్వజగముల రక్షింప • సాక్షిభూత
మగునతండను నీవుమ • మ్మాదరించు॥ పుడమి॥ ౫౭

సీ. నీపాదవనజముల్ • నిరతంబు స్తుతియింప
సకలపాతకములు • సమసిపోవు
నిరతంబునీకథల్ • నిష్ఠతోవినుచుండ
నిబిడదారిద్ర్యముల్ • నిలకఁబాఱు
నీభక్తవరులతో • నిత్యముభాషింప
నిఖిలదుఃఖంబులు • నిలువకేగు
నీదాసులనుఁజూచి • నిలచిమ్రొక్కినయంత
నిఖిలసౌఖ్యంబులు • నిలచియుండు
గీ. నీమహాత్వంబు వర్ణింప • నేర్పరెవరు
మదినినెవరెట్లుఁదలచిన • మదముమీఱు॥ పుడమి॥ ౫౮

సీ. దాసదాసుఁడనంటి • దోసిలొగ్గియుంటి
దోషరాసులఁబాఱఁ • దోలుమంటి
వేణుగానవినోద • వేగరమ్మనియంటి
కాపాడుటకునీవు • గతియటంటి
కరుణించి రక్షించ • గతివేఱెలేదంటి
నెమ్మనంబుననిన్ను • నమ్మియుంటి
గరుడవాహనుఁడవై • ఘనముగారమ్మంటి
గాసిఁజేయకనన్నుఁ • గావుమంటి
గీ. తడవుసేయకరక్షించు • దాతవనుచు
భక్తవర్యులుమీకథల్ • బలుకవింటి॥ పుడమి॥ ౫౯

సీ. గోపాలబాలయో • గోపికాహృల్లోల
కాపాడవే వేణు • గానలోల.

సామజపరిపాల ♦ సర్వజగత్పాల
కరుణించవేనన్న ♦ కనకచేల
సర్వజనాధార ♦ సద్భక్తమందార
దరిఁజేర్పవేనన్న ♦ దురితదూర
జగదేకశూరన ♦ జ్జనపాపపరిహార
వేరుఁజేయకునన్న ♦ మేరుధీర
గీ. సాదరంబున రక్షించు ♦ సమరశూర
వేరె దిక్కెవ్వరికఁగావ ♦ వేగరార॥ పుడమి॥ ౬౦

సీ. నీవుఁజేసినయట్టి ♦ నిఖిలవస్తువులనుఁ
గనుఁగొన చోద్యంబు ♦ గల్గుచుండు
జంతుసంతతుల క ♦ త్యంత చిత్రాంగముల్
గలుగఁజేసిననేర్పు ♦ ఘనతరంబు
భూతకోటులకెల్ల ♦ భువినియాహారముల్
గలుగఁజేసిననేర్పు ♦ కడుఘనంబు
సృష్టిచేయుటఁజేసి ♦ బ్రహ్మమీరగుదురు
రక్షించుటనురమా ♦ రమణుడంద్రు
గీ. గిట్టజేయుటవలనను ♦ గిరిశుడంద్రు
అఖిలకల్యాణదాయక ♦ యాదిదేవ॥ పుడమి॥ ౬౧

సీ. తల్లిదండ్రియుగురుల్ ♦ దనకుఁదోడ్పనునట్టి
దేవతాసములని ♦ దెలియవలయు
పెద్దలపొడగన్న ♦ తద్దయుభక్తితోఁ
జేరినమస్కృతుల్ ♦ జేయవలయు
మనసువాక్కునుఁబనుల్ ♦ మరువకనొక్కటి
గానుండ కార్యముల్ ♦ గనుపవలయు

వేఁగుజాముననె లేచి ♦ వేడ్కతో దేవుని
తన మదిలోపలఁ ♦ దలఁచవలయు
గీ. పరధనంబులపై నాస ♦ పడఁగరాదు
భూతదయగల్గి మనవలె ♦ పుడమియందు॥ పుడమి॥ ౬౨

సీ. బీదసాదులతోడ ♦ వాదులాడఁగరాదు
పక్షపు సాక్ష్యంబుఁ ♦ బలుకరాదు
దాన జాలంబులఁ ♦ గాసి జేయఁగరాదు
జారచోరుల చెంతఁ ♦ జేరరాదు
పరులకుఁ జెరుపగు ♦ పనులు సేయఁగరాదు
పరసతిపై నాస ♦ పడఁగరాదు
పరుస వాక్యంబులు ♦ పరులఁ బల్కఁగరాదు
పరమాత్ము భజనంబు ♦ మరువరాదు
గీ. ఆటలాడుచునైన బొంం ♦ కాడరాదు
గురువులానతి నెప్పుడైన ♦ మరువరాదు॥ పుడమి॥ ౬౩

సీ. బీద సాదులకును ♦ భిక్ష మిచ్చెడివేళ
వలదని చెప్పుట ♦ వలనఘము
సభలోనఁ గూర్చుండి ♦ సత్యంబుఁ జెప్పక
పక్షపాతముఁ బల్క ♦ పాపమగును
వసుధ నిర్మించిన ♦ వనతటాకంబుల
నరికివేయుట చాల ♦ దురితమగును
దేవాలయంబుల ♦ దేవార్చనంబులు
జరుగకుండఁగఁ జేయ ♦ దురితమగును
గీ. నిట్టి పాతక కార్యముల్ ♦ కష్టమనకఁ
జేయువారికి జముని చేఁ ♦ జేటుమూడు॥ పుడమి॥ ౬౪

సీ. మాధవ నీ నామ ♦ మంత్రబలంబుచే
దురిత సంఘంబులఁ ♦ ద్రుంపవచ్చు
మాధవ నీ నామ ♦ మంత్రబలంబుచే
బలువైన వ్యాధులఁ ♦ బాపవచ్చు
మాధవ నీ నామ ♦ మంత్రబలంబుచేఁ
గడు దరిద్రంబులఁ ♦ గాల్పవచ్చు
మాధవ నీ నామ ♦ మంత్రబలంబుచే
శమను దూతలనెల్లఁ ♦ జండవచ్చు
గీ. నీదు నామంబు పఠియించి ♦ నిష్ఠతోడ
మోదమందుచు గనవచ్చు ♦ మోక్షములను॥ పుడమి॥ ౬౫

సీ. దాతవై సిరిఁగల్గి ♦ దానంబు నడుగుట
యత్నించి యోచింపఁ ♦ జిత్రమగును
ధరణీ తలంబెల్ల ♦ తన యధీనంబైన
కలశాబ్ధిలో నేల ♦ కాపురంబు
బంగారుగుబ్బలు ♦ బల్లకీలుండియు
ఖగరాజు పైనెక్క ♦ కతమదేమొ
వనరై నదింపఁగతి ♦ వాసులుఁ గల్గియుఁ
ఫణిరాజుశయ్యగాఁ ♦ బండుటేమొ
గీ. దానజాలంబుఁ దమావెంటఁ ♦ దగిలివత్తు
రనుచు నేటికి నీరీతి ♦ ననుసరింప. పుడమి. ౬౬

సీ. రాధామనోహర ♦ రక్షింపవేలరా
పలుమారుఁ బిలచినఁ ♦ బలుకవేర
సరసిజోదరనిన్ను ♦ సన్నుతిఁజేతురా
నేటికీతమవు ♦ నన్నేలరార

ముచికుందవరద నీ ♦ ముద్దులుఁ జూపరా
వేణుగానవినోద ♦ వేగరార
గోవర్ధనోద్ధార ♦ కోపమేటికిరార
మేరమీరెదవేల ♦ మేరుధీర
గీ. శరణుజేసినవారలఁ ♦ గరుణతోడఁ
గాచిరక్షించు బిరుదైనఁ ♦ గలుఁగదేర. పుడమి. ౭౭

సీ. తప్పులమన్నించి ♦ దయనేలకున్నను
దిక్కెవరిఁకనాకు ♦ దీనపోష
మరుగుఁజొచ్చినవాని ♦ మన్నించవలెగాక
విడుచుట న్యాయమా ♦ విశ్వజనక
దాసులెల్లరు నీకు ♦ ధనమొసంగిరె మున్ను
కాచిరక్షించవా ♦ కరుణతోడ
దాసదాసుఁడనన్ను ♦ గాసిఁజేయకుమయ్య
దోసిలి యొగ్గితి ♦ దోషరహిత
గీ. నీదెభారంబు ననుఁబ్రోవ ♦ నీరజాక్ష
నీవురక్షింపకున్న నే ♦ నెవరిఁదలతు. పుడమి. ౭౮

సీ. ఇనసూనుతోఁగూడి ♦ కనుమూసినంతనె
నిర్జరాధిపసూను ♦ నీల్గఁజేసి
కమఁవేడ్క మీరంగఁ ♦ గపిరాజుఁజేపట్టి
వాయుజుచే సీత ♦ వార్తలరసి
వనితామణినిఁగొన ♦ వననిధి బంధించి
రాక్షసాధిపునితో ♦ రణమొనర్చి
ఘనులగు రావణు ♦ తనయుని ననుజుని
యనిలోన మార్కొని ♦ హతమొనర్చి

గీ. తుదకు రావణుపదితలల్ ♦ ద్రుంచివైచి
సుదతిఁజేపట్టి ♦ సుఖమున్న సుందరాంగ ॥పుడమి॥ ౧౯

సీ. కరిమొఱాలించియు ♦ కడువేగజనుదెంచి
మదమునజరియించు ♦ మకరిద్రుంచి
సరసిలోపలికేగి ♦ సామజంబునుఁదీసి
కరస్పర్శనముఁజేసి ♦ గాసిదీర్చి
డింభకుస్తుతివిని ♦ స్తంభమందుదయించి
దురమునఁదనుజునిఁ ♦ ద్రుంచివైచి
దినకరశతకోటి ♦ దీప్తులకధికమౌ
భీకరాకారంబుఁ ♦ బొందినిలచి
గీ. కడకు బాలునిస్తుతులచేఁ ♦ గరుణయుంచి
హితమువదినుంచి శాంతివ ♦ హించినారు॥ పుడమి॥ ౨౦

సీ. సర్వపాపహరంబు ♦ సంతోషదాయకం
బఖిలసంపదలకు ♦ నాకరంబు
ఆద్యంతశూన్యంబు ♦ నాధారరహితంబు
అనుపమానంబును ♦ నవ్యయంబు
నిత్యనిరంజనమును ♦ నిగమాంతవేద్యంబు
నజమప్రమేయంబు ♦ నవ్యయంబు
సజ్జనసేవ్యంబు ♦ సాక్షిభూతంబును
నిఖిలభూతంబులు ♦ నిలుచునెలవు
గీ. నగుచుఁబొలుపొందుచుండెను ♦ నార్యవినుత
వింతనిస్సనిగొనియాడ ♦ నెంతవాఁడ॥ పుడమి॥ ౨౧

సీ. పుడమిలోపలనీవు ♦ భూతకోటులనెల్లఁ
బుట్టించునేర్పునఁ ♦ బొగడదరమె

భూతకోటుల కెల్ల ♦ భువిని సాహాయ్యముల్
గల్పించు నేర్పున ♦ గనఁగనగున
భువిలోన బాలురు ♦ బొమ్మరింటాడెడి
గతిని ప్రపంచంబుఁ ♦ గలుగ నీకు
నీసృష్టి మహిమంబు ♦ నింపుగా వర్ణింప
తరముగాదన వచ్చు ♦ ధాతకైన
గీ. మాఁదుగుణముల చేఁజిక్కి ♦ మాల మెలఁగి
సర్వమునుఁ జేయుచుందువు ♦ సాక్షివగుచు ॥పుడమి॥ 22

సీ. అభయంబొసంగవా ♦ యమరసన్నుతనాదు
దురితజాలంబుల ♦ దోలివేగ
సుగుణంబులొసఁగరా ♦ సుమశరజనకనా
దుర్గుణంబుల నెల్ల ♦ దొలఁగ జేసి
భక్తియొసంగరా ♦ ముక్తిదాయకనాదు
యాపదలన్నియు ♦ నణఁచివైచి
నిర్మలుఁ జేయురా ♦ నిగమసన్నుత నాదు
చిక్కులనెల్లను ♦ జక్కపరచి
గీ. నీదుసత్కృపయుంచరా ♦ వేదవేద్య
నాదుమన వాలకించరా ♦ మోదమునను ॥పుడమి॥ 23

సీ. పన్నగాశయనా ♦ విన్నపంబాలించి
నన్ను మన్నించుమయా ♦ పన్నరక్ష
నీపాదవనజముల్ ♦ నిరతంబు నమ్మితి
నన్నుఁ జేపట్టరా ♦ సన్నుతాంగ
నీవె నాదిక్కని ♦ నెరనమ్మియున్నాఁడ
విడనాడ కెప్పుడు ♦ వినుతనామ

దాసపోషకనన్ను ♦ గాసిఁజేయువటంచు
నెమ్మనంబుననిన్ను ♦ నమ్మియుందు
గీ. నీదెఖారంబు రక్షింప ♦ నిగమపోష
వేరెగతియొంటులేదయ్య ♦ వెదకిచూడ ॥పుడమి॥ ౭౪

సీ. భానుకోటిప్రభా ♦ భాసితుండనఁనొప్పి
భక్తకోటులబాధ ♦ బాపునెవఁడు
సర్వజగంబుల ♦ సమతరక్షింపుచు
నిర్వికల్పుండన ♦ నెగడునెవఁడు
అనఘుఁడై యొప్పుచు ♦ నఘసమూహంబుల
సరసఁజేరగనీక ♦ జరుపునెవఁడు
శరణాగతత్రాణ ♦ బిరుదాంకముఁగల్గి
కరుణతో దాసుల ♦ గాచునెవఁడు
గీ. అట్టిపరమాత్మమదిలోన ♦ ననుదినంబు
దలఁచలేనట్టి మనుజుల ♦ దొలఁగదఘము॥ పుడమి॥ ౭౫

సీ. ఇందిరానందుఁడై ♦ యందమౌనై కుంఠ
పురనివాసుండునై ♦ పరమకృపను
దంతియార్తారవం ♦ బింతయాకర్ణించి
యతివేగజనుదెంచి ♦ హస్తిగాంచి
అర్భకుమొఱవిని ♦ యసురేంద్రుబరిమార్చి
సాధులకెల్లను ♦ సౌఖ్యమొసఁగి
అక్షయవలువలా ♦ యజ్ఞానన కొసంగి
మోదంబుగాంచు దా ♦ మోదరుఁడ
గీ. నీవు నిన్నేలు సతతంబు ♦ నీరజాక్ష
యఖిలపాతక నివహంబు ♦ లణఁచివేగ॥ పుడమి॥ ౭౬

సీ. సిరిధర వరకృపా ♦ కరిమాని రక్షణ
సురరిపుశిక్షకయో ♦ సుజనవినుత
యదువంశ కులదీప ♦ సదమల మణిభూష
సురుచిర రూపయో ♦ శూరవర్య
పరమాత్మ కేశవ ♦ పాపవినాశకయో
వరకూర్మ రూపక ♦ వాసుదేవ
దశరథ నందన ♦ దశముఖ భంజన
కరుణా సముద్రయో ♦ కంజనయన
గీ. కరుణయుంచియు రక్షించు ♦ కామజనక
దాసదాసుండ రక్షించు ♦ వదలకేల॥ పుడమి॥ 22

సీ. సన్నుత చరితుండు ♦ పన్నగాశనవాహుఁ
డమిత సత్వోన్నతుం ♦ డవ్యయుండు
ఇనకోటి సమతేజుఁ ♦ డిందిరా రమణుండు
సనకాది వినుతుండు ♦ సర్వసముఁడు
అసమాన కోదండుఁ ♦ డరిగాజ మర్దనుం
డినకుల దీపకుం ♦ డద్ధచరితు
డాద్యంత శూన్యుండు ♦ నాదిమవేలుపు
పరిపూర్ణ హృదయుండు ♦ పాపరహితు
గీ. డగునతండును నీవు న ♦ న్నను దినంబు
గాచి రక్షించవలెనయ్య ♦ కరుణతోడ॥ పుడమి॥ 23

సీ. యదుకుల తిలక ని ♦ న్నెదఁ గోరఁ దలంచిన
దోషంబు లెల్లను ♦ దొలఁగి చనును
కరుణాసముద్ర నీ ♦ కథ లాలకించిన
కష్టంబు లేవియుఁ ♦ గలుగకుండు

భావజ జనకనీ ♦ భక్తులతోఁ గూడ
పరలోక సౌఖ్యంబుఁ ♦ బడయవచ్చు
నాకేశనుత నీదు ♦ నామంబు పఠియింప
నిరుపమానందమౌ ♦ నెలవు దొరకు
గీ. ననుచు నార్యులుఁ బల్కఁగా ♦ నవనివినియు
నిన్ను నమ్మితి రక్షించు ♦ నన్ను తాంగ॥ పుడమి॥ ౩౪

సీ. దీనశరణ్యయో ♦ దానవాంతక నన్నుఁ
జేపట్టి రక్షించు ♦ శేషశయన
వేదాంత వేద్యయో ♦ వేణుగాన వినోద
కరుణఁ బ్రోవవె నన్ను ♦ కామజనక
భక్తమందారయో ♦ ముక్తిదాయక నన్ను
నిరతంబుఁ గాపాడు ♦ నిర్వికల్ప
పాపవినాశ గో ♦ పాలబాలక నన్ను
దయతోడ నేలవే ♦ దనుజవైరి
గీ. నీదె రక్షించు భారంబు ♦ నిగమవినుత
నమ్మియున్నాడ నిరతంబు ♦ నెమ్మనమున॥ పుడమి॥ ౩౫

సీ. బీదసాదులఁ బ్రోచు ♦ బిరుదుఁ గల్గియువారి
రక్షించకుంనుట ♦ రట్టుగాద
దీనులఁ గాపాడఁ ♦ దెంపుజేసెదరంచు
గజరాజుఁ గాచిన ♦ కథయెసాక్షి
బీదల రక్షించు ♦ బిరుదున్నదని తెల్ప
యాల కుచేలునిగాచు ♦ టదియెసాక్షి
వాపుఁజేరినవారిఁ ♦ దప్ప కేలెదరంచుఁ
దెల్పు విభీషణు ♦ తెఱఁగువిన్న

గీ. మేటిశూరులు మీతోటి ♦ సాటిమెవరు
దానులకు దానుఁడను నన్ను ♦ దయనుఁబ్రోవు॥ పుడమి॥ ౮౧

సీ. మేటిశూరుల నీటు ♦ మీటు మీశౌర్యంబు
పాటియు దప్పినా ♦ నేటికిట్లు
మాటిమాటికి వేడ ♦ పాటిసేయక నన్ను
సాటివారలలోనఁ ♦ జోకఁజేసి
నాటినాటికి యీస ♦ నీటిమాటగఁ జేసి
దాటిపోదుదనంచుఁ ♦ దలఁచినారొ
గట్టిగా పదములఁ బట్టితి ♦ విడువను
పొట్టిబుద్ధులు నింకఁ ♦ గట్టిపెట్టి
గీ. కఠినతనము వహింపకఁ ♦ గరుణతోడ
రట్టుబెట్టకు నన్నేలు ♦ కష్టమునకు॥ పుడమి॥ ౮౨

సీ. తను వశాశ్వతమని ♦ దలఁచియు మానవుల్
సత్యప్రవర్తన ♦ సలుపకెపుడు
సాధుల నలయించి ♦ సత్యంబుఁ దప్పియు
కుమతులై యజ్ఞములఁ ♦ గూర్చుకొనుచు
తామె శ్రేష్ఠులమంచు ♦ బిరుదు నిక్కుచునుందురి
కటపటి కష్టముల్ ♦ గానలేరు
ఎచ్చుటెచ్చట దన ♦ కేది సంప్రాప్తమో
గనఁజాల కెప్పుడు ♦ గరుడ గమను
గీ. పాదపద్మంబు లెదలోనఁ ♦ బ్రస్తుతించు
మనుజులకు సాటిరారయ్య ♦ మహినినోరులు॥ పుడమి॥ ౮౩

సీ. సకల సజ్జనులచే ♦ సాధించు స్థానంబు
సకల పాతకములు ♦ సమయునెలవు

అన్ని స్థానంబుల ♦ నెన్నికఁ గలచోటు
యతిభక్తి శ్రద్ధల ♦ నరయుపట్టు
నన్నిరీతులచేత ♦ నెనలేనియునికియుఁ
గనిననరుల్ దిరుగ ♦ గానిత్రోవ
కలుషజాలంబులుఁ ♦ గలుగనేరనిపట్టు
యజునికై నను యుంద ♦ నట్టి విడిది
గీ. కధిపతివి నన్ను రక్షించు ♦ యాదిదేవ
నిన్నుదలఁచెద నిరతంబు ♦ సన్నుతాంగ॥ పుడమి॥ ౮౪

సీ. పుడమిలో మానవుల్ ♦ బొంకులాడఁగరాదు
హరిపదధ్యానంబు ♦ మరువరాదు
పరకాంతలను జూచి ♦ భ్రాంతి జెందఁగరాదు
మధువైరి చరితంబు ♦ మరువరాదు
పాపహేతువునగు ♦ పనులుఁ జేయఁగరాదు
పక్షపాతంబులుఁ ♦ బలుకరాదు
పరుస వాక్యంబులుఁ ♦ బల్కుచుండఁగరాదు
పరమాత్మ భజనంబు ♦ మరువరాదు
గీ. మనుజుఁడేవేళ సద్ధర్మ ♦ మును విడువక
మెలఁగవలెగాని వేరేది ♦ మేలుగాదు॥ పుడమి॥ ౮౫

సీ. నిన్నుఁబూజించిన ♦ నిఖిలపాపక్షయం
బనుచుఁ దెల్పుదు రెప్పుఁ ♦ డార్యవరులు
నీ కథలాలించ ♦ నిచ్చగించని నరుల్
కడతేరు గతియొండు ♦ గానరాదు
ఇహలోక సౌఖ్యంబు ♦ లిచ్చగింతురుగాని
పరలోక సుఖముకై ♦ భ్రాంతిపడరు

కన్నుగానక పర ♦ కాంతల గవయుటె
దమకు సౌఖ్యంబని ♦ ధరణియందు
గీ. పెక్కు మానవులీరీతిఁ ♦ బెచ్చుపెరిఁగి
తనదు కడపటి గతియేదొ ♦ దలఁచుకొనరు॥ పుడమి॥ ౮౬

సీ. జాలలోఁ జిక్కిన ♦ మీలచందంబున
పరగ యురిలోఁ జిక్కు ♦ పక్షిభఁగి
జొక్కమార్జాలికిఁ ♦ జిక్కుమూషికలాగు
వ్యాఘ్రంబునకుఁజిక్కు ♦ యావుపగిది
గార్చిచ్చులోఁజిక్కు ♦ కర్కోటకముభాతి
మృగయునిచేఁజిక్కు ♦ మేకముకరణి
కరుణావిహీనుఁడౌ ♦ కటికవానికిఁ జిక్కు
తగరు చందంబున ♦ తారుశేమను
గీ. దూతలకుఁ జిక్కి పెనుబాధఁ ♦ దూలివెనుకఁ
జింతనొందిన సుఖమెట్లు ♦ జిక్కనయ్య॥ పుడమి॥ ౮౭

సీ. కర్షకుల్ ధాన్యముల్ ♦ కాలానుగుణముగ
విత్తిపంటలుచేయు ♦ విధముగాను
కానన మేకములు ♦ కముకూర్చిర మృగయులఁ
గనితాము దొరకని ♦ కరణిజనులు
ఏకాలమేరీతి ♦ నేదిజేయఁగఁదగు
దానినేఁజేయుచు ♦ ధరణియందు
నేవిధంబగు హాని ♦ నెప్పుడుఁ జెందక
భగవంతు దలఁచుటె ♦ భాగ్యమనుచు
గీ. నవనిలోపల కాలంబు ♦ తప్పువిధమునఁ
గడువుచుండిన కష్టముల్ ♦ గలుగవండ్రు॥ పుడమి॥ ౮౮

సీ. చెంతఁ జేరినవారి ♦ చింతఁ దీర్చెదరంచు
నమ్మినేనిరతంబు ♦ నెమ్మితోడఁ
ననిశంబు మీపాద ♦ మతిభక్తితోనమ్మి
పూజించుచున్నాఁడ ♦ భుజగశయన
నాయాపదలుకొన్ని ♦ నసియించుచున్నవి
పూర్తిగా పోవుట ♦ పుడమినెపుడొ
ఆలస్యముగ నన్ను ♦ యాదరింపఁదలంచ
బాధకోర్వఁగఁజాల ♦ భవవిదూర
గీ. కన్నతండ్రిరో నాయందుఁ ♦ గరుణయుంచి
తీవ్రముగ నాదు యాపదల్ ♦ దీర్చవయ్య॥ పుడమి॥ ౮౯

సీ. కరుణించు భారంబుఁ ♦ గలిగియుండియుఁజాల
కష్టపాటొందించు ♦ కతమదేమొ
పుత్రవాత్సల్యతఁ ♦ బూనియుంటిరిగదా
తడవుఁజేసినయంతఁ ♦ దప్పిపోన
కష్టపెట్టియువెన్కఁ ♦ గాపాడుచుందుట
మీకేమిమేలది ♦ మిహిరకులజ
దాసులతప్పులు ♦ దండంబుతోఁదీరు
గడఁజేసి దయతోడఁ ♦ గావవయ్య
గీ. తప్పులుండిన మన్నించు ♦ దానవారి
తామపేక్షింప రక్షించు ♦ దాతలెవరు॥ పుడమి॥ ౯౦

సీ. హరినామ కీర్తన ♦ లనిశంబుఁ జేసిన
సకలపాతకములు ♦ సమసిపోవు
హరిభక్తులనుఁజూచి ♦ యాదరించినవారి
దురితంబులెల్లను ♦ దొలఁగిపోవు

విష్ణు చరిత్రముల్ ♦ వినుచుండువారలు
దుఃఖంబులెల్లను ♦ దొలఁగిపోవు
నిరతంబు నిష్ఠతో ♦ నిందిరేశు చరిత్రఁ
బఠియించువారిపా ♦ పములు దొలఁగు
గీ. భక్తిఁ బూజసల్పిన ♦ ముక్తిగలుగుఁ
జిత్తమున హరిందలఁచక ♦ జెముడురెలను॥ పుడమి॥ ౯౧

సీ. నీదాసులనుజూచి ♦ మోదమందనివారి
పరుపుపాత్యంబుఁ ♦ బలుకువారి
తల్లిదండ్రులతోడఁ ♦ దగవులాడెడివారి
దానమివ్వంగ వ ♦ ద్దనెడివారి
బరుషవాక్యంబులఁ ♦ బల్కుచుండెడివారి
హరియంచునుడువని ♦ యట్టివారి
సత్కార్యవిఘ్నముల్ ♦ సలుపుచుండెడివారి
సరసుల పరిహాస ♦ పరచువారి
గీ. కాలుడూతలుఁ బట్టుకఁ ♦ గట్టితన్ని
యమపురంబున బాధింతు ♦ రంచుబుధులు॥ పుడమి॥ ౯౨

సీ. అనుదినంబును నిన్ను ♦ యతిభక్తిఁ బూజించు
జనులను జెందదు ♦ జమునిభీతి
విమలమౌ మీకథల్ ♦ వినుచుండువారలు
కాలపాశంబుచేఁ ♦ గట్టుపడరు
హృదయంబునందు నీ ♦ పదములనామంబు
మరవనివారలు ♦ మహితయశులు
మీభక్తవరులతో ♦ మెలఁగుచుండెడివారి
కిహపరసౌఖ్యంబు ♦ లెసఁగునంద్రు

గీ. సద్గుణస్తోమ సన్నుత ♦ సార్వభౌమ
భక్తవరకల్ప రక్షించు ♦ భవవిదూర ॥పుడమి॥ ౯౩

సీ. దీనమందారయో ♦ దివిజవందితనామ
పరిపూర్ణ గృపఁ బ్రోవు ♦ పరమపురుష
పావనాకారయో ♦ పశుపతి సన్నుత
కాపాడవే నన్ను ♦ కామజనక
కరుణాసముద్రయో ♦ కలుషాబ్ధిబాడబ
నన్ను మన్నించవే ♦ నాగశయన
భవరోగవైద్యయో ♦ భక్తవత్సలనన్ను
నిరతంబు గాపాడు ♦ నిగమవినుత

గీ. నమ్మియున్నాఁడ నిరతంబు ♦ నెమ్మనమున
దురితముల దోలి రక్షించు ♦ కరుణతోడ ॥పుడమి॥ ౯౪

సీ. సరసమౌ మీకథల్ ♦ సతతంబు వినునట్టి
కర్ణముల్ పరమముఁ ♦ గాంచియొప్పు
యనిశంబు మీనామ ♦ మతిభక్తిఁ బఠియించు
రసనయుఁ బరమున ♦ రసమునొందు
మీ రూపమునయంబు ♦ నేర్పుతో నీక్షించు
నయనముల్ గనుగొను ♦ నాయమొప్పును
పుడమిపై మిమ్ములఁ ♦ బూజించుహస్తముల్
వేడ్కమై బరమప ♦ విత్రమొందు

గీ. మీపదమున మెట్టుపదములు ♦ మేలుగాంచు
ననుచు పెద్దలు బల్కుదు ♦ రమరవంద్య ॥పుడమి॥ ౯౫

సీ. అనయంబు మానవుం ♦ డానందహృదయుఁడై
సతతంబు హరిభక్తి ♦ సలుపవలయు

దురితంబులోసరించు ♦ దుష్టచేష్టలనెల్ల
దూరంబుగాఁ బారఁ ♦ దోలవలయు
హరిభక్తి గురుభక్తి ♦ యాత్మలో మరువక
వినయంబునను ధాత్రి ♦ మనఁగవలయు
సాధుసద్గుణులతో ♦ సాంగత్యమొనరించి
దుర్గుణంబులనెల్లఁ ♦ దునుమవలయు
గీ. గాని విషయముల్ వినరాదు ♦ వీనుద్వయిని
పాపకార్యంబులను నాల్కఁ ♦ బలుకరాదు॥ పుడమి॥ ౯౬

సీ. అరయలోకములకు ♦ దొరలు మీరగుటచే
నితరుల యాజ్ఞ మీ ♦ కేమిలేదు
ఇందిరాదేవి మీ ♦ యిల్లాలగుటచేత
ధనవంతునెవ్వడైన ♦ దలఁచబోరు
నిఖలవిద్యలఁ బ్రౌఢ ♦ నెగడుకోడలు గల్గ
విద్యాధికులజోలి ♦ వెదుకబోరు
అనమాన సౌందర్యుఁ ♦ డగు పుత్రుఁడుంటచే
నెవ్వరితోఁ బని ♦ యేమిమీకు
గీ. అందరికి లోకువగు భక్తు ♦ లెందులోఁది
యంచు విడవక రక్షించు ♦ కొంచెమనక॥ పుడమి॥ ౯౭

సీ. భవ వినాశనియగు ♦ భరత ఖండక్షేత్ర
యామ్యదిగ్భాగమం ♦ దమరియుండు
చెన్నరాజ్యంబుఁ ద ♦ ద్భిన్న రాజ్యమునందుఁ
గర్నూలు జిల్లాను ♦ ఘనత మెరయు
జామదగ్నిక్షేత్ర ♦ మామహాస్థలమున
కనతి దూరంబున ♦ నవ్వనుతిగాంచు

సిం:గుల్కు తురిమెళ్ల ♦ పురమునం దాంగ్లేయ
పదియునుం దొమ్మిదిఁ ♦ బైనిరెండు
గీ. పదులు మూఁడవ వత్సర ♦ సుదినమందు
సీస శతపద్య మణిమాలఁ ♦ జేసినాఁడ॥ పుడమి॥ ౯౮

సీ. అందమా మాలమీ ♦ సుందరగళము నం
దుంచినాఁడను దీని ♦ గాంచి హృదయ
సదనుసీమను మంచి ♦ ముదముఁ బెంచియుధాత్రి
భూపతుల్ ప్రజలెల్ల ♦ భోగములనుఁ
బాడిపంటలుఁ గల్గి ♦ భావమం దుత్సాహ
పరులునై మీపాద ♦ భజనములను
నాయురారోగ్యాది ♦ యమిత సంపదఁగల్గి
బాదలుచుండఁగఁ జేసి ♦ భూమినెపుడు
గీ. సరసమగువానఁ గురిపించి ♦ సాధులెల్ల
తపముసల్పఁగ సతతంబు ♦ దయనుబ్రోవు॥ పుడమి॥ ౯౯

సీ. శ్రీరామ నామంబుఁ ♦ జింతించుచేవేళ
మదియందు ముదమందు ♦ సద్గుణులును
బలివంశ జనితులై ♦ ప్రబలుచు న్నిద్ధాత్రి
బలిజ వారనుపేరఁ ♦ బరఁగువారు
వర కురువేముల ♦ వంశాబ్ధిసోములౌ
చలమ యార్యులసేవఁ ♦ జెలఁగువారు
శ్రీవేంకటార్యులఁ ♦ జేపట్టు సతిబుచ్చ
మాంబాత్మజులు నల్వు ♦ రందులోన
గీ. నుదయగిరివంశ సత్కీర్తి ♦ సాంద్రయుతుఁడ
జెన్నయాఖ్యుండ శతకంబుఁ ♦ జెప్పినాఁడ

పుడమిలోపల తురిమెళ్ల • పురమునందు
వెలసియున్నట్టి మాధవ • వేదవేద్య॥ ౧౦౧

సంపూర్ణము



శ్రీ తురిమెళ్ళ లక్ష్మీ మాధవ శతకం బచ్చువేయించుటకై ద్రవ్యసహాయముఁ జేసిన పుణ్యపురుషులకొక విన్నపము.

ఉ. శ్రీకరమార్య సమ్మతము • శిష్టవిచారిత సప్తసంతతుల్
జేకొని వృద్ధిఁ జేయుటయు • జీవితకాలమునందె సజ్జనుల్
లోకహితంబునెంచి కడు • లోభగుణంబులఁ బెంపొనర్పక౯
మీకభిమాన మున్నయెడ • మేదిని నీశతకంబుఁ గాంచుడీ॥ ౧॥

క. నిరుపమ గుణ సంపన్నుఁడు
సరసిజ లోచనుఁడు సముఁడు • సత్యచరిత్రుం
డురు కీర్తియుతుఁడు విష్ణుఁడు
నిరతము సంపదలొసంగు • నెనరున మీకు౯॥ ౨॥

గీ. సిరియు మాధవు లిరువురు • శీఘ్రముగను
చందదారుల కెల్లను • డెందములర
మోదమున తరగకుండగ • సాదరమున
నెల్లకోర్కె లొసంగుదు • రెల్లవేళ॥ 3

శ్రీ. శ్రీ. శ్రీ.

సమాప్తము.

